

# ఒక రోజు రాజు

బొగ్దాదులో, హారూనల్ రషీద్ పరిపాలించే కాలంలో, ఒక వింత బ్రహ్మచారి ఉండేవాడు. అతని పేరు అబూ అల్‌హసన్. అతను ప్రతిరోజూ సాయంకాలం వేళ నగరంలోని నది వంతెన చివర నిలబడి, నగరంలోకి కొత్తగా వచ్చేవాణ్ణి ఒకణ్ణి పట్టుకుని, తన యింట ఆతిథ్యం స్వీకరించటానికి ఆహ్వానించేవాడు. అతిథి ధనికుడు కానీ, దరిద్రుడు కానీ, ముసలివాడు కానీ, యువకుడు కానీ, అబూ అల్‌హసన్‌కు పట్టింపు లేదు; అతిథి పొరుగూరివాడూ, ఎరగనివాడూ అయి ఉండాలి. ఒక రాత్రి తన ఇంట ఆతిథ్యం పొందినవాణ్ణి అతను రెండో రోజు ఉదయమే సాగనంపేవాడు; ఒకవేళ ఆ అతిథి నగరంలో మరొకసారి కనిపించినా కూడా, అతన్ని ఎరగనట్టు ముఖం తిప్పుకుని, తన దారిన తాను వెళ్ళేవాడు. అబూ అల్‌హసన్ ప్రవర్తన అతని ఇరుగుపొరుగు వారికి చాలా వింతగానూ, విడ్డూరంగానూ తోచేది.

ఒకనాడు సూర్యాస్తమయం వేళ అబూ అల్‌హసన్ వంతెన చివర నిలబడి ఉండగా, ఒక మోసల్ వర్తకశ్రేష్ఠుడు నగరం కేసి వచ్చాడు. ఆయన వెనక ఒక దీర్ఘకాయుడైన బానిస ఉన్నాడు.

ఆ వర్తకుడు మరెవరో కాదు, మారువేషంలో నగర పరిసరాలు తణిఖీ చెయ్యటానికి వెళ్ళి తిరిగి వస్తున్న ఖలీఫాయే. అబూ అల్‌హసన్ ఆ సంగతి ఎరగడు. అతను ఆ వర్తకుడికి ఎదురు వెళ్ళి, వంగి వందనం చేస్తూ ఆయనను ఆ రాత్రి తన ఇంటికి అతిథిగా రమ్మని ఆహ్వానించాడు.

"ఈ రాత్రికి మీరు నా ఆతిథ్యం స్వీకరించినట్టయితే రేపు తాపీగా సత్రంలో బస ఏర్పాటు చేసుకో వచ్చును," అన్నాడతను ఖలీఫాతో.

ఖలీఫాకు అబూహసన్ ప్రవర్తన వింతగా తోచింది. ఇలాటివాడి పరిచయం ఒక కొత్త అనుభవంగా ఉంటుందనుకుని ఆయన ఆ యువకుడి ఆతిథ్యానికి సమ్మతించి, అతని వెంట అతని ఇంటికి వెళ్ళాడు.

హసన్ తల్లి రుచి రుచిగా వంటకాలు తయారు చేసి భోజనం పడ్డించింది. ఇద్దరూ భోజనం ముగించి, కబుర్లు చెప్పుకుంటూ తాగటానికి ఉపక్రమించారు.

ఆ సమయంలో అబూ అల్‌హసన్ తన అతిథితో, "మీరాక నా కెంతో ఆనందం కలిగిస్తున్నది," అన్నాడు.

అతని కథ ఏమిటో తెలుసుకోవాలని ఖలీఫా, "బాబూ, నువు ఎరగని వారికి ఇలా ఆతిథ్యం ఎందు కిస్తున్నావో, నీ కథ ఏమిటో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉన్నది," అన్నాడు.

అబూ అల్‌హసన్ ఇలా చెప్పాడు:

"నా పేరు అబూ అల్‌హసన్. నా తండ్రి వర్తకుడు. నాకు నగరంలో మంచి ఆస్తినే వదిలి నా తండ్రి మరణించాడు. నా తండ్రి నన్ను చిన్నతనం నుంచీ ఎంతో కట్టుదిట్టంగా పెంచటం చేత, నాకు స్వేచ్ఛగా సుఖాలలో మునిగి తేలాలని కోరికకలిగింది. అయితే నేను బొత్తిగా అవివేకిని కాను. అందుచేత నేను నాకున్నదంతా రెండు భాగాలుగా విభజించి, సగం ఆస్తిని వస్తురూపంలో భద్రపరిచి, మిగతాది డబ్బురూపంలో ఖర్చు చేస్తూ, నాతోటి స్నేహితులతో కలిసి కోటీశ్వరుడిలాగా జీవించ సాగాను. సుఖాలకోసం



ఎంత ధనమైనా ఖర్చు చెయ్యటానికి వెనకాడలేదు. సరిగా సంవత్సరం తిరిగే సరికి నా చేతిలో చిల్లిగవ్వ మిగలకుండా పోయింది. ఆ స్థితిలో నేను నా మిత్రుల సహాయం కోరాను. వాళ్ళు కానరాకుండా పోయారు. నేను వారి వెంటబడి నా దీనస్థితిని గురించి చెప్పుకున్నాను. వాళ్ళందరూ ఏవేవో సాకులు చెప్పారే తప్ప, నాకు ఒక్కరోజు తిండికి కూడా సహాయం చేయకపోయారు. నన్ను కట్టుదిట్టాలలో పెంచిన నా తండ్రి వివేకం నాకు అప్పుడు తెలిసి వచ్చింది. నేను నా ఇంటికి తిరిగి వచ్చి, ఎన్నడూ స్నేహితులతో కలిసి తిరగననీ, ఎరగని వారికి తప్ప ఆతిథ్యం ఇయ్యననీ ప్రమాణం చేశాను. దీర్ఘకాలస్నేహం కన్న క్షణికమైన స్నేహం మధురమైనదని నాకు అనుభవం ద్వారా తెలిసి వచ్చింది. ఎరగని వారితో కూడా రెండు రోజులు వరసగా స్నేహం నెరపనని ఒట్టు పెట్టుకున్నాను. అందు చేత, రేపు ఉదయం నేను మీకు వీడ్కోలు చెబితే మీరు ఆశ్చర్యపడవద్దు. మన ఈ స్నేహం ఈ రాత్రితోనే చెల్లు! తిరిగి మీరు ఏ నాడైనా వీధిలో కనిపించినా నేను మీ కేసి చూడను.''

హసన్ కథ విని ఖలీఫా అతనితో, ''నీ ప్రవర్తన విడ్డూరంగా ఉన్నప్పటికీ, వివేకంతో కూడి ఉన్నది. నువు దూరదృష్టితో సగం ఆస్తి భద్రపరుచుకోవటం ప్రశంసనీయం. నువు చక్కగా రోజు కొక కొత్త వ్యక్తితో ప్రసంగిస్తూ, వినుగు చెందకుండా





రోజులు గడుపుతున్నావు. అయితే, రేపు ఉదయం మనకు ఎడబాటు కలుగుతుందన్నది నన్ను బాధిస్తున్నది. నువు చేసిన ఈ అతిథి సత్కార ఋణం ఉంచుకోవటం నా కిష్టంలేదు. అందుచేత నువు ఏదైనా కోరిక వెలిబుచ్చినట్టయితే నేను దాన్ని నెరవేర్చుతానని ప్రమాణం చేస్తున్నాను. మొహమోటపడి చిన్న కోరిక కోరకు. అల్లా దయవల్ల నేను తీర్చలేని కోరిక ఉండదు," అన్నాడు.

ఈ మాట విని అబూ అల్ హసన్ ఏ మాత్రమూ ఆశ్చర్యం ప్రకటించక, "మీరు కనబడటమే నాకు పదివేలు, అంతకు మించి నేను కోరనవసరం లేదు. మీ సదుద్దేశానికి ధన్యవాదాలు. కాని నాకు తీరదగిన కోరిక అంటూ ఏదీ లేదు. నా జీవితం నాకు తృప్తికరంగానే ఉన్నది. అందులో ఇతరులు తీర్చదగినలోటు ఏదీ లేదు," అన్నాడు.

"నాకోరిక నిరాకరిస్తే అల్లా మీద ఒట్టు! మీ హృదయంలో ఉండే ఏదో ఒక కోరిక కోరని పక్షంలో నాకు తీరని అవమానం కలుగుతుంది. అపకారాన్ని సహించవచ్చు గాని ఉపకారాన్ని సహించటం ఎంతో బాధ. ఉదారుడైనవాడు తీసుకున్న దానికి రెట్టింపు ఇవ్వాలి," అన్నాడు ఖలీఫా.

తన అతిథి పట్టుదల గ్రహించినవాడై హసన్ కొంత సేపు తల వంచుకొని ఆలోచనలో పడ్డాడు. తరవాత అతను తల ఎత్తి, "నాలో ఒక కోరిక ఉన్నమాట నిజమే గాని, అది వెర్రి కోరిక. అది బయట పెడితే నన్ను గురించి మీరు మరొకలాగా అనుకోవచ్చు," అన్నాడు.

"కోరిక ఏమిటో తెలియకుండా అది వెర్రి కోరిక అనుకోవటం ఎలా? నేను కావటానికి వర్తకుణ్ణిగాని, నువు అనుకున్న దానికన్న నాకు ఎక్కువ శక్తే ఉన్నది. అందుచేత నీ కోరిక బయట పెట్టు," అన్నాడు ఖలీఫా.

"మీరు అడిగారు గనక చెబుతున్నానే గాని, నా కోరిక తీర్చే శక్తి ఒక్క ఖలీఫాకే

ఉన్నది. కనీసం ఒక్కరోజు పాటైనా నేను హారూనల్ రషీద్‌గారి స్థానంలో బాగ్దాదు నగరానికి ఖలీఫా కావాలన్నదే నా కోరిక," అన్నాడు హసన్.

ఖలీఫా ఒక్క క్షణం ఆలోచించి, "ఒక్క రోజు నగరానికి ఖలీఫా అయితే నువు ఏం చేదామనుకుంటున్నావు?" అని హసన్‌ను అడిగాడు.

"అయ్యా, ఈ బాగ్దాదునగరం నాలుగు పేటలుగా విభజించబడి ఉన్నది. ఒక్కొక్క పేటకూ ఒక్కొక్క ప్రధానాధికారి ఉన్నాడు. మా పేటకున్న అధికారి పరమ నీచుడూ, దుష్టుడూనూ. వాడు చేసే పాపిష్టి పనులకు ఇద్దరు సహాయకులున్నారు. ఒకడు పేడి మూతివాడూ, మరొకడు బట్ట తలవాడూనూ. వీళ్ళు పరువుగలవాళ్ళ రహస్యాలన్నీ రాబట్టుతారు, వాళ్ళను అపఖ్యాతి పాలు చేస్తారు. డబ్బు కోసం గడ్డి తింటారు. సాధు సజ్జనులకు మనుగడలేకుండా చేస్తున్నారు. నేను ఒక్కరోజు ఖలీఫా అయిన పక్షంలో నాకు ధనం అక్కర్లేదు, నా వారికి ధనం ఇవ్వను, కాని మా పేటకు ఈ ముగ్గురి పీడా వదిలించి, ఆ ముగ్గురి శవాలనూ కందకంలోకి ఈడ్పిస్తాను," అన్నాడు అబూ అల్‌హసన్.

"నిజంగా నీ కోరిక ఔదార్యంతో కూడు కున్నదిగా ఉన్నది. నీ కోరిక తీరటం నువు అనుకున్నంత కష్టం కూడా కాదేమో. ఎందు కంటే, ఖలీఫా వింత అనుభవాల కోసం తహతహలాడే స్వభావం గలవాడు. ఆయనకు





నీ కోరిక తెలిసినట్టయితే ఒక పగలూ, ఒక రాత్రీ నిన్ను ఖలీఫాగా చేసినా చెయ్య వచ్చు," అన్నాడు ఖలీఫా.

అబూ అల్‌హసన్ ఈ మాటకు నవ్వి, "ఏదో మనం ఊసుపోకగా మాట్లాడు కుంటున్నాం గాని, నా కోరిక తెలిస్తే ఖలీఫా గారు నన్ను తప్పక వెర్రివాళ్ళ బంది ఖానాలో పెట్టేస్తాడు. అందుచేత ఒకవేళ దివాణంలో మీకు తెలిసిన వారెవరన్నా ఉంటే, నేను యిప్పుడు పేలిన పేలుడు గురించి మాత్రం వాళ్ళలో ఎవరికీ చెప్ప కండి," అన్నాడు.

"నేను నీ సంగతి మరెవరితోనూ చెప్ప నని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు ఖలీఫా. కాని అప్పటికే ఆయన ఈ అవకాశం వినియోగించుకుని మంచి ప్రహసనం ఆడ నిశ్చయించుకున్నాడు. ఆయన ఎన్నోసార్లు మారువేషంలో తిరిగాడు గాని, ఇలాటి మంచి అవకాశం ఆయనకు ఏనాడూ దొరకలేదు.

ఆయన హసన్ వెంట నుంచి సారాసీసా తీసుకుని, "నన్ను పొయ్యనీ," అంటూ సారాతో గ్లాసులు నింపి, హసన్ చూడ కుండా అతని గ్లాసులో మంచి ఘాటైన మత్తుమందు కలిపాడు.

హసన్ తన అతిథి అందించిన సారా తీసుకుంటూ, "ఇప్పుడే చెబుతున్నాను, తెల్లవారి మీరు వెళ్ళిపోయే సమయానికి నేను నిద్రలేవక పోవచ్చు. అందుచేత మీరు వెళ్ళిపోతూ తలుపులు మూసి వెళ్ళటం మరిచిపోకండి," అన్నాడు.

ఖలీఫా అలాగే నన్నాడు. హసన్ నిశ్చింతగా సారా తాగి, తాగుతూనే ఒళ్ళు తెలియ కుండా విరుచుకు పడిపోయాడు. అది చూసి ఖలీఫాకు నవ్వు ఆగలేదు.

ఆయన తన బానిసను పిలిచి, "ఈ మని షిని ఎత్తుకుని, నా వెంటరా," అన్నాడు. ఇద్దరూ కలిసి బయటికి వచ్చారు. "ఈ ఇంటిని బాగా గుర్తుపెట్టుకో, నేను పంపితే నువు ఇక్కడికి రావలిసివస్తుంది," అన్నాడాయన తన బానిసతో.

వాళ్ళు వీధిలోకి నడిచారు, కాని తలుపులు మూయటం మరిచారు.

వాళ్ళు రాజప్రాంగణంలోకి రహస్య ద్వారం గుండా ప్రవేశించి, ఖలీఫా సొంత పడక గది చేరుకున్నారు.

"ఈ మనిషి కట్టుకున్న బట్టలన్నీ తీసేసి, నా రాత్రి దుస్తులు తొడిగి, ఇతన్ని నా పక్కమీద పడుకోబెట్టు," అని ఖలీఫా తన బానిసను ఆజ్ఞాపించాడు.

ఈ పని పూర్తి కాగానే ఖలీఫా రాజభవనంలోని ముఖ్యుల నందరినీ తన గదికి పిలిపించాడు. ఆయన వజీర్లూ, ప్రతీహారులూ, కొజ్జాలూ, అంతఃపుర కాంతలూ వచ్చారు.

ఖలీఫా వారితో, "రేపు మీరంతా ఈ గదికి వచ్చి, ఈ మనిషి ఆజ్ఞ లన్నిటినీ పాలించాలి. నా ఎడల ఏ విధంగా నడుచుకుంటారో ఇతని ఎడల కూడా అచ్చుగా అలాగే నడుచుకోవాలి. అతనే నేను అనుకోండి. నన్ను సంబోధించినట్టే అతన్ని కూడా సంబోధించండి. అతని కోరిక ఎంత స్వల్పమైనదైనా సరే ఉపేక్షించవద్దు. దీనికి భిన్నంగా నడిచిన వారిని, నా కొడుకైనా సరే, కోట గుమ్మం వద్ద ఉరి తీయిస్తాను," అన్నాడు.

"చిత్తం, చిత్తం," అని అందరూ వెళ్ళిపోయారు. కాని వజీరు జఫర్, వేత్రహస్తుడు మస్రూర్ మాత్రం ఉండిపోయారు.

ఖలీఫా వారితో, "మీరు అందరి కన్న ముందే నిద్ర లేచి వచ్చి, ఇతని ఆజ్ఞలు తెలుసుకోండి. అతను ఏమి చెప్పినా ఆశ్చర్య పడవద్దు. అతను ఒప్పుకోక పోయినా సరే, అతను ఖలీఫాయేనన్నట్టు మీరు నటించాలి. అతను చెప్పిన వారి కందరికీ దానధర్మాలు చెయ్యండి. ఖజానా ఖాళీ అయిపోయినా సంకోచించవద్దు. అతని ఆజ్ఞలను బట్టి దండనలూ, బహూకృతులూ, ఉరి శిక్షలూ, ఉద్యోగాలూ, బర్తరఫులూ అమలు చెయ్యండి. ఇదంతా నా వినోదం కోసం ఏర్పాటయినట్టు అతనికి తెలియనివ్వవద్దు. మీరు లేస్తూనే నన్ను కూడా నిద్ర లేపండి," అన్నాడు. —(ఇంకా ఉంది)





# ఒకరోజు రాజు

## 2

మర్నాడు ఉదయం జఫర్, మస్రూర్‌లు వెళ్ళి ఖలీఫాను నిద్రలేపారు. ఆయన అబూ అల్‌హసన్ నిద్రపోతున్న గదికి వెళ్ళి, తెరల చాటున దాక్కున్నాడు. అక్కడి నుంచి ఆయన ఎవరి కంటా పడకుండా జరిగే దంతా గమనించటానికీ, ఆలకించటానికీ వీలున్నది.

తరవాత జఫర్, మస్రూర్‌లు రాజభవనం లోని ప్రముఖులనూ, స్త్రీలనూ, బానిసలనూ వెంటబెట్టుకుని అదే గదిలోకి ప్రవేశించారు. నిద్రలేవబోతున్నది ఖలీఫాయే అయినట్టు వారంతా ఎవరి స్థలాలలో వారు మౌనంగా నిలబడ్డారు.

ముందుగా తరిఫీదు పొందిన ఒక బానిస హసన్ ముక్కు దగ్గిర ద్రావకంలో ముంచిన గుడ్డ ఉంచాడు. వెంటనే హసన్ మూడు తుమ్ములు తుమ్మాడు. బానిస అతని ముక్కూ, ముఖమూ పన్నీటితో తుడిచాడు. మత్తు వదిలి హసన్ నిదానంగా కళ్ళు తెరిచి చూశాడు.

తాను పడుకుని ఉన్న పక్క అపూర్వంగా ఉన్నది. దానిమీద పరిచిన దుప్పటి ఎర్ర జరీతో నేసి, ముత్యాలు కుట్టి ఉన్నది. తల ఎత్తి చూస్తే చాలా విశాలమైన గది కనిపించింది. దాని గోడలకు విలువైన పట్టు బట్టలు వేలాడుతున్నాయి. గది మూలలలో బంగారు, స్ఫటిక పాత్రలున్నాయి.

హసన్ తన దృష్టిని కిందికి దింపి, తన చుట్టూ ఉన్న అందమైన స్త్రీలనూ, బానిసలనూ చూశాడు. వారంతా తనకు వంగి సలాములు చేస్తున్నారు. వారి వెనకగా అంతులేని మంత్రులూ, అమీర్లూ, ప్రతీహారులూ, నల్లకొజ్జాలూ ఉన్నారు. ఎత్తు గద్దె మీద గాయకులూ, వారి చుట్టూ వాద్య

గాళ్ళూ సంగీతం వినిపించటానికి సిద్ధంగా ఉన్నారు.



అతను పడుకున్న శయ్యకు సమీపం లోనే ఖలీఫా ధరించే దుస్తులు పెట్టి ఉన్నాయి. వాటి రంగు చూడగానే అవి ఖలీఫా ధరించేవని హసన్‌కు తెలిసి పోయింది.

హసన్ మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. అప్పుడు జఫర్ అతన్ని సమీపించి మూడు సలాములు చేసి, ఎంతో వినయంగా, "ఏలిన వారిని లేపటానికి అనుమతి ఇవ్వండి. ఉదయ ప్రార్థనకు వేళ అయింది," అన్నాడు.

అబూ అల్‌హసన్ తన రెండు కళ్ళూ ఒక దాని తరవాత ఒకటి నలుచుకున్నాడు. తన చెయ్యి గిల్లుకుని, "అమ్మో!" అని కేకపెట్టి, "నేను కలగనటం లేదు. నేను ఖలీఫానే!.... కాని, ఆ మోసల్ వర్తకుడితో నోటికి వచ్చినదెల్లా మాట్లాడుతూ తెగ తాగానే, దాని ఫలితమే అయి ఉండాలి," అని, గోడకేసి తిరిగి, మళ్ళీ నిద్రపోజూశాడు.

జఫర్ మళ్ళీ అతన్ని సమీపించి, "ఏలిన వారు ఉదయ ప్రార్థన పట్ల ఉదాసీనంగా ఉండటం తమ బానిసకు ఆశ్చర్యంగా ఉన్నది, మన్నించండి!" అన్నాడు.

ఆయన సైగ చేయగానే సంగీతం ఆరంభ మయింది. పాటగాళ్ళు వాద్యాల సహ కారంతో శ్రావ్యంగా పాడసాగారు. హసన్ వాళ్ళకేసి చూసి, "ఒరే, హసన్, నిద్రలో ఇలాటి పాట ఎన్నడన్నా విన్నావురా?" అనుకుంటూ లేచి కూర్చున్నాడు. అతను తన కళ్ళను నమ్మలేకుండా ఉన్నాడు. అతని బుర్ర పనిచెయ్యడం లేదు.

అతను తన చేతులు చాచి చూసుకు న్నాడు. చేతులు ఉన్నాయి. "ఇది ఆశ్చర్యం కాదూ? విడ్డూరం కాదూ? ఒరే హసన్, నువు ఎక్కడ ఉన్నావు? ఎక్కడ ఉన్నా వురా, నా తల్లి కొడుకా? నువు నిద్రపోతు న్నావా? మేలుకుని ఉన్నావా? ఎంత కాలంగా నువు ఖలీఫావి? ఈ భవనమూ, ఈ పక్కా, ఈ ఘరానా మనుషులూ, ఈ కొజ్జా




వాళ్ళూ, ఈ అందమైన అమ్మాయిలూ, ఈ చక్కని పాటగాళ్ళూ, వాయిద్యగాళ్ళూ, ఇవీ, అవీ, అవీ అన్నీ ఎప్పటి నుంచీ నీ సొత్తు?" అన్నాడు.

అంతలో సంగీతం నిలిచి పోయింది. మస్రూర్ ముందుకు వచ్చి, హసన్ ముందు మూడు సార్లు సలాం చేసి, "ఏలిన వారు చిత్తగించాలి. ఉదయ ప్రార్థన వేళ దాటి పోయింది. తమరు దీవాన్‌కు బయలుదేరే వేళ అయింది," అన్నాడు.

తాను ఏదో చెయ్యాలనేసరికి హసన్ అనుమానం రెట్టింపు అయింది. అతను మస్రూర్ కేసి తీక్షణంగా చూస్తూ, "ఏయ్, ఎవరు నువు? నేను ఎవరు?" అని అడిగాడు.

"తమరు మా ప్రభువు; ముసల్మానుల ఏలిక; ఖలీఫా హారూనల్ రషీద్. అబ్బాస్ సంతతిలో అయిదోవారు. ఈ అధమాధముడు తమ ఖడ్గాన్ని పట్టుకునే గౌరవం పొందిన అనామకుడు మస్రూర్," అంటూ మస్రూర్ అత్యంత నమ్రతతో సమాధాన మిచ్చాడు.

"అంతా అబద్ధం!" అని అబూ అల్ హసన్ అరిచాడు.

"ఏలినవారు నన్ను పరీక్షించాలని అలా అంటున్నారు. పరీక్షలు చాలు, మహా ప్రభూ. తమ కేదో పీడకల వచ్చి ఉంటుంది," అన్నాడు మస్రూర్.

అబూ అల్ హసన్ నిగ్రహం తప్పి, పక్క మీద విరుచుకు పడి పోయి వెర్రిగా నవ్వుతూ, కాళ్ళు కొట్టుకుంటూ, దుప్పట్లు చుట్టుకోసాగాడు. ఇదంతా తెర వెనక నుంచి చూస్తున్న ఖలీఫా నవ్వు అపుకోవటానికి నానా పాట్లూ పడ్డాడు.

నవ్వు తెర ఆగిపోయాక హసన్ లేచి కూర్చుని ఒక చిన్న నల్ల బానిసను దగ్గిరికి రమ్మని, "నన్నెరుగుదువా? బాగా నా ముఖంకేసి పరీక్షగా చూసి, నేను ఎవరో చెప్పగలవా?" అని అడిగాడు.

నల్ల బానిస అణకువగా కళ్ళు దించి, "తమరు మా ప్రభువు, హారూనల్ రషీద్," అన్నాడు.

"నల్ల మొహంవాడా, అంతా అబద్ధం. నువు నిజం చెప్పటం లేదు," అన్నాడు హసన్.

అతను ఒక చిన్న ఆడబానిస కేసి తన వేలు చూపి, "కొరుకు!" అన్నాడు. ఆమె ఆ వేలిని గట్టిగా కొరికింది. హసన్ బాధతో కేక పెట్టి, "నేను నిద్ర పోవటం లేదు, మేలుకునే ఉన్నాను," అని ఆ బానిసను, "నన్ను గురించి వీళ్ళు చెప్పేది నిజమా?" అని అడిగాడు.

ఆ బానిస పిల్ల చెయ్యిచాచి, "అల్లా ఏలిన వారిని కాపాడాలి. తమరు ఖలీఫా హారూనల్ రషీద్‌గారే!" అన్నది.

"నా తల్లి కొడకా, విన్నావురా? నువు ఖలీఫావే!" అని అరిచి ఆ పిల్ల కేసి తిరిగి, "అబద్ధం ఆడుతున్నావే, తప్పుడుముండా! నే నెవరో నా కన్న నీకు బాగా తెలుసా?" అన్నాడు హసన్.

అంతలో కొజ్జాల పెద్ద వచ్చి, "ఏలిన వారు జలకమాడే వేళ అయింది," అంటూ హసన్‌ను పక్క మీది నుంచి కిందికి దింపాడు. అతను పక్క దిగగానే అందరూ ఒక్కసారిగా, "ఖలీఫాకు జై!" అని కేక పెట్టారు.

"ఎంత చిత్రం! నిన్న నేను అబూ అల్ హసన్‌ను. ఇవాళ ఖలీఫా హారూనల్ రషీద్‌ను లాగుంది!" అని హసన్ అనుకుంటుండగా



కొజ్జాల పెద్ద అతని కాళ్ళ దగ్గిర పాదరక్షలుంచాడు. అటువంటి పాదరక్షలను హసన్ ఎన్నడూ చూడలేదు. వాటికి బంగారు నగిషీలూ, ముత్యాలూ ఉన్నాయి. ఎవరో తనకు ఖరీదైన పాదరక్షలు బహూకరించారనుకుంటూ హసన్ వాటిలో పాదాలు దూర్చాడు.

ఇదంతా చూసే వాళ్ళు నవ్వు అతికష్టం మీద దాచుకోగలిగారు. ఖలీఫా తెరల వెనక నవ్వుతో విరుచుకు పడిపోయాడు.

తరవాత హసన్‌కు పన్నీటితో స్నానం చేయించి, రాజోచితమైన దుస్తులు తొడిగి, నెత్తిన కిరీటం పెట్టి, అతని చేతికి బంగారు దండం ఇచ్చారు.

"నేను అబూ అల్ హసన్‌ను అవునా, కానా ?" అని అతను తనలో ఒక క్షణం వితర్కించుకుని, పైకి అందరూ వినేలాగా, "నేను అబూ అల్ హసన్‌ను కాను. అలా అని అన్నవాణ్ణి కొరత వేయించేస్తాను! నేను నేనే! హారూనల్ రషీద్‌ను!" అన్నాడు.

అతను అందరితో కలిసి దర్బారు భవనానికి వెళ్ళాడు. మస్రూర్ అతన్ని సింహాసనం మీదికి ఎక్కించి, రాజ దండాన్ని అతని మోకాళ్ళ మీద అడ్డంగా ఉంచాడు. అందరూ హర్షధ్వనులు చేశారు.

హసన్ సభా భవనాన్ని కలయజూశాడు. దానికి నలభై ద్వారాలున్నాయి. ద్వారాలన్నిటా జనం కిటకిటలాడుతున్నారు. కత్తులు పట్టుకున్న రక్షకభటులూ, వజీర్లూ, అమీర్లూ, కులీనులూ, రాయబారులూ అతనికి కనిపించారు. ఆ జనంలో అతను జఫర్‌నూ, మరికొందరు రాజభవనోద్యోగులనూ గుర్తించాడు.

జఫర్ ముందుకు వచ్చి, ఒక కాగితాల కట్ట తీసి, ఆ రోజు ఖలీఫా పరిశీలించవలసిన విన్నపాలు చదవసాగాడు. అవి ఏమిటో తనకు అర్థం కాకపోయినా హసన్ తొణకకుండా విని, ప్రతి విన్నపం మీదా ఎంతో తెలివిగా తన నిర్ణయం చెప్పాడు. ఇక్కడ కూడా తెర చాటు నుంచి అంతా గమనిస్తున్న ఖలీఫా హసన్ నిర్ణయాలకు అద్భుతం చెందాడు.

జఫర్ విన్నపాలు చదవటం ముగియగానే హసన్, రక్షకభట నాయకుడి కోసం



అడిగాడు. అహ్మద్‌ను అతనికి చూపారు. హసన్ అహ్మద్‌ను దగ్గిరికి పిలిచి, సాష్టాంగ పడిన అహ్మద్‌ను లేవమని, "నువు పది మంది భటులను వెంట బెట్టుకుని ఫలాని వీధిలో, ఫలాని పేటలో ఫలాని ఇంట ఉండే వాణ్ణి, వాడి ఇద్దరు అనుచరులనూ పట్టుకో. ఆ ఇంటివాడు ఆ పేటకు అధిపతి. వాళ్ళ ముగ్గురికీ ముందుగా నాలుగేసి వందలు దెబ్బలు రుచి చూపించు. తరవాత వాళ్ళకు చింకి పాతలు కట్టి, ఒక ఒంటె మీద వెనక్కు తిప్పి కూర్చోబెట్టి, నాలుగు పేటలూ తిప్పు. తిప్పేటప్పుడు ఇలా చాటింపు వేయించు: 'ఇతరుల పరువు తీసే వారికీ, స్త్రీలను అగౌరవ పరిచే వాళ్ళకూ, సజ్జనుల మీద నిందలు వేసే వాళ్ళకూ ఇదే శిక్ష!' ఈ తతంగం పూర్తి అయాక పేట అధికారిని కొరత వేయించి, వాడి శవాన్ని కందకం లోకి ఈడ్పించు. వాడి అనుచరులను తేలికగా శిక్షించు," అన్నాడు.

కొత్త ఖలీఫా ఆజ్ఞలను అమలు చెయ్యమని అహ్మద్‌కు అదివరకే హెచ్చరిక అంది ఉండటం చేత, అతను సలాం కొట్టి, హసన్ ఆజ్ఞలను అమలు చెయ్యటానికి వెళ్ళిపోయాడు.

తరవాత హసన్ ఖలీఫా హోదాలో అనేక తీర్పులిచ్చాడు, ఉద్యోగాలు ఇచ్చాడు, ఉద్యోగులను తొలగించాడు. రాచకార్యాలన్నీ ఎంతో సమర్థతతో నిర్వర్తించాడు. ఇదంతా చాటునవుండి చూస్తున్న ఖలీఫా చాలా సంతోషించాడు.



అహ్మద్ కొంతసేపటికి తిరిగి వచ్చి, హసన్ చేతికి ఒక కాగితం ఇచ్చాడు. హసన్ ఆజ్ఞలను అహ్మద్ పూర్తిగా పాలించినట్టు ఆ కాగితం మీద సాక్షులు చాలా మంది సంతకాలు చేశారు.

"మంచిది. అపవాదులు ప్రచారం చేసే వాళ్ళకూ, ఆడవాళ్ళ శీలం చెడగొట్టే వాళ్ళకూ, ఇతరుల విషయాలలో జోక్యం కలిగించుకునే వాళ్ళకూ నేను ఇలాటి శిక్షే ఇస్తాను. అందరూ బాగా గుర్తుంచుకోండి," అని హసన్ ప్రకటించాడు.

తరవాత అతను కోశాధికారిని పిలిచి, "నువు సంచీలో వెయ్యి బంగారు దీనారాలు తీసుకుని ఫలాని పేటలో అబూ అల్ హసన్ అనే వాడి ఇంటికి వెళ్ళి, హసన్ తల్లికి ప్రణామం చేసి, 'ఖలీఫాగారు తమకు ఈ వెయ్యి దీనారాలు బహుమానంగా పంపారు. ఖజానా ఖాళీగా ఉండటం చేత ఇంతకన్న ఎక్కువ పంపలేక పోయారు' అని మనవి చేసి, తిరిగి వచ్చి ఏమి చేసినదీ నాకు చెప్పు," అన్నాడు.

కోశాధికారి అతని ఆజ్ఞ పాలించటానికి వెళ్ళిపోయాడు.

దర్బారు ముగిసిందని హసన్ జఫర్‌కు సంజ్ఞ చేశాడు. జఫర్ సభికులకందరికీ అదే సంజ్ఞ చేశాడు. అందరూ సింహాసనానికి వంగి సలాము చేసి వెళ్ళిపోయారు. చివరకు హసన్ వెంట జఫర్, మస్రూర్‌లు మాత్రమే మిగిలారు. వాళ్ళు అతన్ని సింహాసనం మీది నుంచి దించి జనానాకు చేర్చారు.

అక్కడ భోజనాలకు అంతా సిద్ధంగా ఉన్నది. స్త్రీలు హసన్‌ను చుట్టుముట్టి భోజన శాలలోకి తీసుకుపోయారు. లోపల చక్కని సంగీతం వినిపిస్తున్నది. ఆడపిల్లలు శ్రావ్యంగా పాడుతున్నారు.

"సందేహం ఏమీ లేదు. నేను నిశ్చయంగా హారూనల్ రషీద్‌నే. వింటున్నాను, చూస్తున్నాను. వాసనలు తెలుస్తున్నాయి. నడుస్తున్నాను. అడుగడుగునా నాకు గౌరవ మర్యాదలు జరుగుతున్నాయి. అందుచేత నేను తప్పక ఖలీఫానే!" అనుకున్నాడు హసన్.

—(ఇంకావుంది)






# ఒకరోజు రాజు

## 3

అబూ అల్ హసన్‌కు ఇప్పుడు తాను ఖలీఫానే నన్న నమ్మకం పూర్తిగా ఏర్పడిపోయింది. అతను కూర్చున్న బంగారు భోజనశాల రంగురంగుల తెరలతోనూ, తివాసీలతోనూ, దీపాల కాంతిలో అత్యద్భుతంగా ఉన్నది. గది మధ్య ఏడు బంగారు పళ్ళాలలో రకరకాల మాంసాహారాలు ఎత్తు పీటలపై అమర్చి ఉన్నాయి. వాటి పక్కన ఏడుగురు అందగత్తెలైన యువతులు వింజామరలు పట్టుకుని నిలబడి ఉన్నారు. గది నిండా అగరుధూపం వాసనలు వ్యాపించి ఉన్నాయి.

హసన్ నిన్న చేసిన భోజనం తరవాత ఏమీ తిని ఉండకపోవటంచేత ఆత్రంగా వెళ్ళి పళ్ళాల ముందు కూర్చున్నాడు. వెంటనే ఏడుగురు యువతులూ వింజామరలు వెయ్యసాగారు. హసన్‌కు భోజనం వేళ అంత గాలి అలవాటు లేదు. అందుచేత అతను ఒక్క నీగ్రో యువతిని మటుకే వీచమని చెప్పి మిగిలినవాళ్ళను తన కెదురుగా, అర్ధచంద్రాకారంలో కూర్చోమని, వారిని చూస్తూ తాను భోజనం చెయ్యసాగాడు.

భోజనం ముగిసింది. కొజ్జాలు వచ్చి, అతను చేతులు కడుక్కోవటానికి నీరు తెచ్చి ఇచ్చి, మరొక గదిలోకి దారి చూపారు. ఆ గది భోజనాల గది కన్న కూడా అందంగా ఉన్నది. అక్కడ ఏడు రకాల పళ్ళు అమర్చి ఉన్నాయి. ఏడుగురు అందగత్తెలు నిలబడి ఉన్నారు. హసన్ అన్నిరకాల పళ్ళూ చవి చూసి, మరొక గదికి వెళ్ళాడు.

అక్కడ అందమైన సీసాలలోనూ, బంగారు కూజాలలోనూ అపూర్వమైన పానీ

అరేబియా కథ

యాలు ఉన్నాయి. వాటిని అతనికి అందించటానికి అందగత్తెలున్నారు. హసన్ వారినందరినీ తన చుట్టూ కూర్చోమని వాళ్ళు అందించే పానీయాలు తాగసాగాడు. వారిలో ఒకతె అతనికి మత్తుమందు కలిపిన పానీయం అందించింది. అది తాగుతూనే హసన్ స్పృహ లేకుండా పడిపోయాడు.

ఇంతదాకా తెరల వెనక దాగి హసన్ చర్యలు గమనించి ఆనందిస్తున్న ఖలీఫా ఇప్పుడు ఇవతలికి వచ్చాడు. ఆయన బానిసలను పిలిచి, హసన్ ధరించిన రాజ వస్త్రాలు విప్పమనీ, అతని అసలు దుస్తులు తొడగమనీ చెప్పాడు. తరవాత ఆయన, క్రితం రోజు హసన్‌ను రాజభవనానికి చేర్చిన బానిసను పిలిచి, "ఇతన్ని ఇతని ఇంటికి చేర్చి పడుకోబెట్టి రా," అని ఆజ్ఞాపించాడు. ఆ బానిస అలాగే చేశాడు. ఈసారి అతను మరిచిపోకుండా హసన్ తలవాకిలి తలుపులు మూసి మరీ వచ్చాడు.

మర్నాడు మధ్యాన్నందాకా హసన్ ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు. అప్పటికి మత్తు వదిలి అతనికి స్పృహ వచ్చింది. అతను కళ్ళు తెరవకుండానే తాను కిందటి రోజు చూసిన యువతులందరినీ జ్ఞాపకం తెచ్చుకుని, వారందరినీ పేర్లు పెట్టి పిలిచి, రమ్మని కేకలు పెట్టాడు. కాని ఎవరూ వచ్చిన జాడ లేకపోయే సరికి అతను కోపంగా లేచి కూచుని, కళ్ళు తెరిచాడు.

తాను రాజభవనంలో కాక, తన మామూలు ఇంట్లోనే ఉన్నట్టు తెలిసింది.



ఇది కల అయి ఉంటుందనుకుని హసన్, "జఫర్, జఫర్! మస్రూర్! ఎక్కడ చచ్చారు?" అని అరిచాడు.

ఈ కేకలకు అతని తల్లి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏమిట్రా, నాయనా, అబూ అల్ హసన్? ఏమయింది? ఏమన్నా కల గన్నావా?" అని అదుర్దాగా అడిగింది.

"ముసలిదానా, నువ్వెవరు? ఈ అబూ అల్ హసన్ ఎవడు?" అన్నాడు హసన్.

"అబూ అల్ హసన్ నువ్వే గదరా! నేను మీ అమ్మను గాదూ? నన్నెందుకు గుర్తు పట్టలేకుండా ఉన్నావూ?" అన్నది హసన్ తల్లి.

"పోవే, పీడాకారపు దానా? నువు ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నేను ఖలీఫా హారూనల్ రషీద్‌ను. భూమి మీద అల్లా ప్రతినిధిని. పో అవతలికి!" అని హసన్ కేకలు పెట్టాడు.

అతని తల్లి ఆందోళనపడుతూ, "అర్థం లేకుండా ఏమిట్రా ఆ మాటలు? అలా అరిస్తే చుట్టుపక్కలవాళ్ళు వినగలరు. కొంప మునిగిపోతుంది! శాంతించరా, బాబూ, నీకు పుణ్యం ఉంటుంది!" అన్నది.

హసన్ మరింత గట్టిగా అరుస్తూ, "ముసలితొత్తూ, నిన్ను పొమ్మనలేదూ? నేను నీ కొడుకునంటావు, నీకు మతి ఉన్నదా? నేను హారూనల్ రషీద్‌ను. తూర్పు పడమరలకు ఏలికను!" అన్నాడు.

హసన్ తల్లి మొహం బాదుకుని మొత్తుకుంటూ, "నీకు సైతాను పూనింది. నిన్ను





కున్నది. ఆమె వంట చెయ్యబోయే ముందు తన కొడుక్కు వచ్చిన కల ఎలాటిదో తెలుసుకుందా మనుకుంటూండగా, హసన్ చప్పున మంచం మీది నుంచి కిందికి దూకి, తల్లిని పట్టుకుని ఊపుతూ, "తప్పుడుదానా, నా శత్రువు లెవరు నా రాజ్యం కాజేసి, నన్ను ఈ కుళ్ళు కొంపలో ఖైదు చేశారో చెప్పకపోయావో నీ ప్రాణాలు తీస్తాను! నాకు తిరిగి సింహాసనం వచ్చాక నా ఆగ్రహానికి అంతుండదు, జాగ్రత్త! ఖలీఫా ఆగ్రహం అంటే ఏమిటో మరవకు! ఈ కుట్ర చేసినవాళ్ళని ఈ ఖలీఫా క్షమించడు!" అన్నాడు.

అతను ఆమెను వదిలేసి తిరిగి మంచం ఎక్కి, తల చేతుల్లో పట్టుకుని కూర్చున్నాడు. అతని తల్లి కుప్పకూలిపోయి, గుండె పగిలేటట్టు ఏడవ సాగింది.

కొంతసేపు ఏడ్చిన మీదట ఆమె లేచి వెళ్ళి, ఎంతైనా తల్లి గనక, పన్నీరు కలిసిన షర్బతు తెచ్చి, "తాగు, నాయనా!" అని హసన్ చేత తాగించింది.

తరవాత ఆమె తన కొడుకు ఆలోచనలను మళ్ళించటానికి "ఒరే, నిన్న ఒక తమాషా జరిగింది. నువు వింటే ఎంతో సంతోషిస్తావు. నిన్న రాజభటులు వచ్చి మన పేట అధికారినీ, వాడి కింద పనిచేసే ఇద్దరినీ పట్టుకుని, తలా నాలుగువందల

అల్లాయే కాపాడాలి. నీ మతి ఇంతగా ఎలా చెడింది? పుట్టినప్పటి నుంచీ నా దగ్గిరే ఉంటివి గదా, ఈ ఇంట్లోనే పెరిగితివి గదా! కాసిన మంచి నీళ్ళు తాగు, నాయనా, నిద్రమత్తు వదులుతుంది!" అన్నది.

ఆమె ఇచ్చిన నీరు తాగి హసన్, "ఒక వేళ నేను అబూ అల్ హసన్ అయినా అయి ఉండవచ్చు!" అనుకుంటూ చాలాసేపు ఆలోచనలో మునిగి ఉండి, చివరకు, "అవును, నేను అబూ అల్ హసన్నే. ఇది నా గదే. నువు నా తల్లివే. నా మీద ఏదో ప్రయోగం జరిగింది," అన్నాడు.

హసన్ తల్లి ఆనందబాష్పాలు తుడుచుకుంటూ, తన కొడుకు బాగైనాడు గదా అను

బెత్తం దెబ్బలూ కొట్టి, ఒంటె మీద వెనక్కు తిప్పి కూచోబెట్టి ఊరేగించి, కొరత వేశారు," అన్నది.

ఈ మాట విని హసన్ ఉపశమనం పొందటానికి బదులు రెచ్చిపోయి, "పాపిష్టి ముండా, నేను పొరబడలేదని నువే రుజువు చేస్తున్నావు. ఆ ముగ్గురినీ శిక్షించమని అహ్మద్‌ను పంపినది నేనే! నేను కలగంటున్నాననీ, నాకు సైతాను పూనాడనీ మరొకసారి అనేవు! సాష్టాంగపడి, అన్న దానికి క్షమాపణ వేడుకో!" అన్నాడు.

హసన్‌కు పిచ్చిపట్టిందని అతని తల్లి రూఢి చేసుకున్నది. ఆమె రొమ్ము బాదుకుని ఏడుస్తూ, "అల్లా కనికరించి నీ పిచ్చి కుదర్చాలి! నువు మాత్రం ఖలీఫా పేరు ఎత్తకు. నువే ఖలీఫానని అసలు అనకు. ఇరుగుపొరుగువాళ్ళు విని వలీతో చెప్పారంటే, అతడు నిన్ను రాజభవనం ముందు ఉరి తీస్తాడు," అన్నది.

దీనితో హసన్ మరింత రెచ్చిపోయి, మూలనున్న కర్రతీసి తల్లి మీదికి వస్తూ, "నన్ను అబూ అల్ హసన్ అని పిలవకు. నేను హారూనల్ రషీద్‌ను. కాదన్నావంటే నీ బుర్ర బద్దలు కొడతాను," అన్నాడు.

కొడుకు ఇలా అంటుంటే తల్లికి కోపమూ, దుఃఖమూ కూడా వచ్చింది. ఆమె ఎంతో శాంతంగానూ, ప్రేమగానూ,



"నీ మతి ఇంతగా ఎలా చలించిందిరా, బాబూ? నువు ఖలీఫానని చెప్పుకోవటం నేరమన్న మాట అలా ఉంచి, ఎంత అపచారం! కృతఘ్నత కూడానూ! నిన్న ఆ మహాప్రభువు నాకు వెయ్యి బంగారు దీనారాలు పంపి, ఇంకా పంపుతానని కబురు కూడా చేశాడు," అన్నది.

తాను ఖలీఫాయే నన్న విషయంలో హసన్‌కు ఏ మాత్రమన్నా సందేహం మిగిలి ఉంటే, ఈ మాటతో అది పూర్తిగా పోయింది. ఎందుకంటే కిందటి రోజు ఆమెకు తానే వెయ్యి దీనారాలు పంపాడు.

హసన్ తల్లి కేసి గుడ్లు ఉరిమి చూస్తూ, "ఆ దీనారాలు పంపినది నేను కాదంటావా?



ఆ ధనం తెచ్చినవాడు నా అజ్ఞ మీద రాలె దంటావా? ఇంకా నేను అబూ అల్ హసన్‌నే ననటానికి నీ కెన్నిగుండెలు?" అంటూ తల్లిని కర్రతో బాదసాగాడు.

ఆ దెబ్బలతో ఆమె మాతృప్రేమ అడుగంటింది. ఆమె ఎలుగెత్తి ఇరుగు పొరుగు వాళ్ళను కేక పెట్టింది. త్వరలోనే ఇరుగు పొరుగువాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చి, హసన్ బారి నుంచి తల్లిని కాపాడి, హసన్‌ను గట్టిగా పట్టుకుని, "తల్లి మీదనే చెయ్యి చేసుకుంటున్నావు నీ కేమన్నా పిచ్చి పట్టిందిరా, అబూ అల్‌హసన్? అని మందలించారు.

హసన్ తీవ్రంగా, "అబూ అల్‌హసన్ ఎవడు?" అని అడిగాడు.

పొరుగువాళ్ళు ఆశ్చర్యపోతూ, "నువు అబూ అల్ హసన్‌వి కావూ? ఈవిడ నిన్ను కని పెంచిన నీ తల్లి కాదూ?" అన్నారు.

"గాడిదలు! గాడిద కొడుకులు! పొండి అవతలికి. నేను మీ ప్రభువును, ఖలీఫా హారూనల్ రషీద్‌ను!" అన్నాడు హసన్.

హసన్ నిశ్చయంగా పిచ్చివాడేనని పొరుగువాళ్ళకు నమ్మకం కుదిరింది. ఆ స్థితిలో అతన్ని స్వేచ్ఛగా ఉండనివ్వటం ప్రమాదమనుకుని, వాళ్ళు అతని చేతులూ, కాళ్ళూ కట్టేసి, ఉన్మాదశాలకు కబురు చేశారు. ఒక గంటలోపుగా ఉన్మాదశాల మనిషి, ఇద్దరు రక్షకులను తోడుతీసుకుని వచ్చాడు. రక్షకుల వద్ద కమ్చీలూ, సంకెళ్లూ, గొలుసులూ వగైరా సరంజామా అంతా ఉన్నది.

వాళ్ళను చూడగానే హసన్ పెనగులాడ సాగాడు. అది చూసి ఉన్మాదశాల వాడు హసన్ వీపుమీద కంచీతో రెండు మూడు దెబ్బలు కొట్టి, అతనికి గొలుసులు వేశాడు. తాను ఖలీఫానని చెబుతున్నా వినిపించుకోకుండా ఉన్మాదశాల నుంచి వచ్చిన ముగ్గురూ హసన్‌ను ఉన్మాదశాలకు తీసుకుపోయి, కటకటాల గదిలో అతన్ని అడవి మృగాన్ని బంధించినట్టు బంధించి, ప్రథమ చికిత్స కింద యాభై కొరడా దెబ్బలు కొట్టారు.

పదిరోజుల పాటు ఉదయమూ, సాయం కాలమూ ఇదేవిధంగా చికిత్స సాగినమీదట హసన్ ఆలోచనా ధోరణిలో మార్పు వచ్చింది.

"నాకు గొప్ప దుర్దశకలిగింది. అందరూ నన్ను పిచ్చివాడనుకుంటున్నారంటే, పొర పాటు నాదే అయి ఉండాలి. నేను రాజ భవనంలో ఉన్నట్టు కలగన్నాను కాబోలు. కాని అది కలలాగా అనిపించలేదు. ఈ మాయను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే నిజంగానే నాకు పిచ్చి ఎత్త వచ్చు. అల్లా ఇలాటి మాయలు ఎన్ని కల్పించాడో!" అనుకున్నాడు హసన్.

అతను ఇలా అనుకుంటూండగా, అతని తల్లి అతన్ని చూసి పోదామని ఏడుస్తూ వచ్చింది. అతని దీనస్థితి చూసి ఆమెకు గుండె నీరయిపోయింది. ఆమె తన దుఃఖాన్ని అణచి పెట్టుకుని, "ఎలా ఉన్నావు, నాయనా, అబూ అల్ హసన్?" అని మృదువుగా అడిగింది.

"అమ్మా, అల్లా నిన్ను కాపాడు గాక!" అన్నాడు హసన్ శాంతంగా.

ఆమె ఆనంద పరవశురాలై, "భగ వంతుడి దయవల్ల నీ మనసు బాగుపడింది, నాయనా!" అన్నది.

"అల్లానూ, నిన్నూ క్షమాపణ వేడు కుంటున్నా నమ్మా. అలా పిచ్చిగా ఎందుకు వాగానో నాకే అర్థం కావటం లేదు. సైతాను నన్ను ఆవహించి, నాచేత అలా మాట్లాడించి ఉండాలి. కాని అదంతా అయిపోయింది. నేను బాగుపడ్డాను," అన్నాడు హసన్.

"నిన్ను మళ్ళీ కన్నంత ఆనందంగా ఉందిరా నాకు!" అన్నది హసన్ తల్లి.

"నన్ను ఇక్కడి నుంచి విడిపించమ్మా?" అన్నాడు హసన్.

హసన్ తల్లి చెప్పిన మీదట ఉన్మాదశాల వాళ్ళు అతన్ని పరీక్షించి, పిచ్చి పోయిందని రూఢి చేసుకుని, గొలుసులు విప్పి అతన్ని వదిలిపెట్టారు. అతను తడబడుతూ నడిచి తల్లి వెంట ఇంటికి చేరుకుని, కొరడా దెబ్బల నుంచి కోలుకోవటానికి చాలా రోజులు మంచంలోనే ఉండిపోయాడు.

—(ఇంకా వుంది)





# ఒకరోజు రాజు

## 4

గాయాలు నిమ్మళించిన మీదట అబూ అల్ హసన్‌కు ఇంట్లో కూర్చోవటం విసుగు అనిపించింది. అతను పూర్వంలాగే సూర్యాస్తమయం వేళ వంతెన చివర కూర్చుని, అపరిచితులైన ఆగంతుకుల కోసం చూడ సాగాడు.

అతను వంతెన వద్దకు వెళ్ళిన మొదటి రోజే ఖలీఫా మారువేషంలో సంచారం చేసి తిరిగి వచ్చే రోజు. అందుచేత హసన్ తల ఎత్తి నగరంలోకి వస్తున్న మనుషులను చూసేసరికి, అతనికి మోసల్ వర్తకుడూ, ఆయన వెనక మహాకాయుడైన బానిసా కనిపించారు.

ఒకసారి పరిచయం అయిన వారిని మళ్ళీ పలకరించే అలవాటు లేని కారణం చేత హసన్ వారి మీది నుంచి దృష్టి మళ్ళించి, వంతెన మీదుగా నది కేసి చూడసాగాడు. కాని ఖలీఫా అతనిని వదిలిపెట్ట దలచ లేదు. అతని ద్వారా తనకు ఎంతో ఆనందం కలిగింది. అదీగాక, ఇంటికి తిరిగి వచ్చినాక అతనికి కలిగిన కష్టాలను గురించీ, పిచ్చివాడని చెప్పి అతన్ని ఉన్మాదశాల వాళ్ళు పెట్టిన బాధలను గురించీ ఖలీఫా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే వచ్చాడు. అందుచేత ఆయన హసన్‌ను ఏదో విధంగా బహూకరించటానికి నిశ్చయించుకున్నాడు.

ఖలీఫా హసన్‌ను సమీపించి, అతని భుజం మీద గడ్డం ఆనించి, "మిత్రమా, అబూ అల్ హసన్, క్షేమంగా ఉన్నావా? నిన్ను కౌగలించుకోవాలని ఆత్రంగా ఉన్నది," అన్నాడు.

హసన్ నది మీది నుంచి తన దృష్టి మళ్ళించక, "నిన్ను నేను ఎరగను. పద, పద!" అన్నాడు.

"అదేమిటి, హసన్? నీ అతిథినే మరి చావా?" అని ఖలీఫా అన్నాడు.

"అల్లా సాక్షిగా నేను నిన్ను ఎరగను. నీ దారిన నువు వెళ్ళు." అన్నాడు హసన్.

"నేను నిన్ను సులువుగా గుర్తించానే! మనం నీ యింట సరదాగా గడిపి నెలే కదా అయింది? నువు నన్ను గుర్తు పట్టలేదంటే నేను ఎలా నమ్మను?" అన్నాడు ఖలీఫా.

హసన్ ఈసారి జవాబు కూడా చెప్పక, వెళ్ళమని చేతితో సైగ చేశాడు. ఖలీఫా హసన్ మెడ చుట్టూ చేతులు వేసి, "నీ ధోరణి ఏమీ బాగా లేదు. నన్ను మరొకసారి మీ ఇంటికి తీసుకుపోయి నీకు నా మీద ఎందుకు కోపం వచ్చిందో చెప్పిన దాకా నిన్ను విడవను. నీ వాలకం చూస్తే నేనంటే నీ కేదో గుర్రు ఉన్నట్టు కనబడుతున్నది," అన్నాడు.

అబూ అల్ హసన్ పట్టరాని కోపంతో, "పాపిష్టి ముఖమా! నాకు అన్ని కష్టాలు తెచ్చి పెట్టి మళ్ళీ నాకు అతిథిగా వస్తానని ఎలా అడుగుతున్నావు? నీ ముఖం నాకు చూపించకు," అని గట్టిగా అరిచాడు.

ఖలీఫా హసన్‌ను కౌగలించుకుని, "మిత్రమా, హసన్, నా మీద అంత కోపమా? నా రాకవల్ల నీకేమైనా కష్టం కలిగి ఉంటే అది బుద్ధిపూర్వకంగా నేను చేసినది కాదని నమ్ము. నీకు కలిగిన ఇబ్బంది ఏదో చెబితే



దానికి ప్రతిక్రియ చేయటానికి నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు, హసన్ పక్కనే తాను కూడా వంతెన మీద కూర్చుని, అతని భుజం మీదుగా చెయ్యివేసి.

ఈ మాటలకూ, చేతలకూ హసన్ మెత్త బడి, "ఆ రాత్రి నువు తలుపు మూయ కుండా వెళ్ళిన అనంతరం జరిగిన విడ్డూరాలూ, వాటి ఫలితంగా నాకు కలిగిన ఇక్కట్లూ నీకు చెబుతాను," అంటూ జరిగినదంతా పూస గుచ్చినట్టు వివరంగా చెప్పాడు. అతను తనకు ఖలీఫా భవనంలో జరిగిన అనుభవమంతా ఏదో గాలిచేష్ట అన్నట్టు మాట్లాడుతుంటే ఖలీఫాకు నవ్వు ఆగలేదు.



అది చూసి హసన్, "నా బాధలు నీకు వేళాకోళంగా ఉన్నాయా, లేక నేను కట్టు కథలు చెబుతున్నాననుకుంటున్నావా? నా మాట నమ్మకపోతే ఈ కొరడా దెబ్బల వాతలు చూడు," అంటూ చొక్కా విప్పి, చేతులమీదా, వీపునాగల మచ్చలు చూపాడు.

వాటిని చూసి ఖలీఫాకు కన్నీరు వచ్చి నంత పని అయింది. ఆయన హసన్‌ను ప్రేమగా కౌగలించుకుని, "తమ్ముడూ, నన్ను ఈ రాత్రికి మళ్ళీ మీ ఇంటికి అతిథిగా తీసుకుపో. నీ అతిథ్యం కోసం ఎంతో ఉబలాటంగా ఉన్నది. ఇందుకు గాను రేపు నీకు అల్లా పదివేల రెట్లు మేలు చేస్తాడు చూసుకో!" అని ఎంతగానో బతిమాలాడు.

ఒకే మనిషికి రెండుసార్లు అతిథ్యం ఇవ్వరాదన్న నియమాన్ని హసన్ భంగం చెయ్యక తప్పలేదు. అతను ఖలీఫాను తన ఇంటికి తీసుకుపోతూ, "నేను నిన్ను తప్పనిసరి అయి అతిథిగా తీసుకుపోతున్నాను. నాది ఒకటే ప్రార్థన: తలుపు మూయటం మరవవద్దు," అన్నాడు.

ఖలీఫా అలాగేనంటూ బలవంతాన నవ్వు ఆపుకున్నాడు.

ఇద్దరూ హసన్ ఇంట్లో ప్రవేశించినాక ఒక బానిస వారికి భోజనం వడ్డించి, తాగుడు అందించాడు. ఇద్దరూ తాగుతూ మాట్లాడుకునేటప్పుడు ఖలీఫా అకస్మాత్తుగా, "నిన్ను స్త్రీలు ఎప్పుడన్నా ఆకర్షించారా? నీకు పెళ్ళి మీద మనసుపోలేదా?" అని అడిగాడు.

దానికి హసన్, "నాకు మిత్రులంటేనే సరదా. మంచి భోజనమూ, తాగుడూ, సరసంగా సంభాషణలూ ఉంటే నాకు ఇంకేమీ అక్కర్లేదు. నాకు స్త్రీలంటే ఇష్టం లేదని కాదు. నాకు సైతాను ఆ వింత కలలో చూపించిన ఆడపిల్లల వంటి వాళ్ళు, ఎప్పుడూ నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ, అవతల వాళ్ళ అవసరాలు గమనించి, వాటిని తీర్చుతూ ఉండే వాళ్ళంటే అలాటి స్త్రీని ఒకతెను డబ్బుకైనా కొని, పెళ్ళాడి ప్రేమించగలను. కాని అలాటి ఆడపిల్లలు

ఏ ఖలీఫా అంతఃపురంలోనో, వజీరు జఫర్ అంతఃపురంలోనో ఉంటారు. అందుచేత నేను అలాటి ఆశలు పెట్టుకో లేదు. మామూలు స్త్రీల ముక్కు విరుపులూ, మూతి విరుపులూ భరించేకన్న ఒంటరిగా ఉంటూ, స్నేహితుల సాంగత్యంలో ఆనందం పొందటమే నాకు ఇష్టం," అన్నాడు.

ఇలా అంటూ హసన్ ఖలీఫా అందించిన లోటా తీసుకుని, తాగి స్పృహ తప్పి పడి పోయాడు. ఖలీఫా మళ్ళీ అతని తాగుడులో మత్తుమందు కలిపాడు.

ఖలీఫా సైగ చెయ్యగానే ఆయన వెంట ఉన్న బానిస హసన్‌ను మోసుకుని బయలు దేరాడు. వాడి వెనకగా ఖలీఫా బయటికి వచ్చి, ఈసారి వాకిలి జాగ్రత్తగా మూశాడు. ఏమంటే, ఈసారి హసన్‌ను ఇంటికి తిప్పి పంపే ఉద్దేశం ఆయనకు లేదు.

ఖలీఫా, హసన్‌ను మోస్తున్న బానిసా రహస్యద్వారం కుండా రాజభవనం ప్రవేశించి, ఖలీఫా మందిరం చేరుకున్నారు. కిందటిసారిలాగే, ఖలీఫా హసన్‌కు తన ఉడుపులు తొడిగించి, తన పాన్పు మీద పడుకోబెట్టించాడు. ఆయన మస్రూర్‌ను పిలిచి, ప్రార్థనల వేళకు ముందుగానే తనను లేపమని చెప్పి, తాను పక్క గదిలో పడుకుని నిద్రపోయాడు.



మర్నాడు ఉదయం మస్రూర్ వచ్చి ఖలీఫాను సకాలంలో నిద్రలేపాడు. ఖలీఫా హసన్ పడుకుని ఉన్న చోటికి వెళ్ళాడు. హసన్ మత్తులో ఒళ్ళు తెలియకుండా నిద్ర పోతున్నాడు. కిందటిసారి హసన్ ఏయే గదులలో ఏయే యువతులను చూసి ఉన్నాడో వారినందరినీ ఖలీఫా రప్పించాడు. ఆయన వాద్యాల వాళ్ళనూ, పాడే వాళ్ళనూ కూడా పిలిపించి, అందరినీ వారి వారి స్థానాలలో పెట్టాడు. వారు ఏమేం చెయ్యాలో చెప్పి, హసన్‌కు ద్రావకం వాసన చూపించమని, తాను వెళ్ళి దాక్కున్నాడు.

ద్రావకం వాసన తగలగానే హసన్‌కు మత్తు వదిలింది. అదే సమయంలో దివ్య

మైన గానం ప్రారంభమయింది. కొద్ది క్షణాల పాటు హసన్ కళ్ళు మూసుకునే ఆ సంగీతం విని, తరవాత కళ్ళు తెరిచి చుట్టూ కలియజూశాడు. తాను పూర్వం చూసిన గదే! అదే పక్క, అవే అలంకరణలూ, నగిషీలూ! అంతకన్నా చిత్రం ఏమంటే, తన చుట్టూ అదే అమ్మాయిలు! అతడు లేచి కూర్చుని, కళ్ళు గట్టిగా నులుపుకున్నాడు.

పాట నిలిచిపోయి, గది నిశ్శబ్దమయింది. హసన్ తమకేసి చూడగానే ఆడవాళ్ళ కళ్ళు వాలిపోయాయి.

హసన్ ఆవేశంతో, "నీకు మళ్ళీ మూడిందిరా, హసన్, నా తల్లి కొడకా! ఇవాళ ఈ భ్రమా, రేపు కొరడా దెబ్బలూ, గొలుసులూ, చీకటి కొట్టూనూ! ఒరే మోసల్ వర్తకుడా, నువు మళ్ళీ తలుపు మూయకుండా వెళ్ళావురా! నిన్ను నరకంలో కండలు కొయ్యా! మోసల్ వర్తకులంతా నాశనం కానూ! మోసల్ నగరం మట్టిలో కలిసిపోనూ!" అని అరిచి, భ్రమ తొలిగిపోతుందేమోనని కళ్ళు చాలాసార్లు మూసి తెరిచాడు. తరవాత అతను తనతో తను, "ఒరే దౌర్భాగ్యుడా! మళ్ళీ పడుకుని నిద్రపో. సైతాను వదిలినదాకా లేవకు. ఈ ఆడపిల్లల కేసి చూశావంటే రేపు నీగతి ఏమవుతుందో జ్ఞాపకం ఉంచుకో." అని చెప్పుకుని, దుప్పటి నిండా ముసుగుతన్ని, తాను నిద్రపోతున్నట్టు తనకు నమ్మకం కలగటానికి గురక కూడా పెట్టసాగాడు.



ఇదంతా తెర వెనక నుంచి చూస్తున్న ఖలీఫాకు నవ్వుతో ఉక్కిరి బిక్కిరి అయింది.

కాని హసన్ ఎలా నిద్రపోగలడు? అతనికి ఎంతో ఇష్టమైన గన్నా అనే పిల్ల అతని పక్కనే వచ్చి కూర్చుని, "ఏలిన వారు చిత్తగించాలి. ఉదయ ప్రార్థనలకు వేళ అవుతున్నది," అన్నది.

హసన్ దుప్పటి లోపలినుంచి, "ఛో, సైతాన్!" అని రంకెపెట్టాడు.

"ఏలిన వారికి ఏదో పీడ కల వచ్చినట్టున్నది. నేను సైతానును కాను, గన్నాను!" అన్నదామె.

హసన్ దుప్పటి ముఖం మీది నుంచి తీసి, కళ్ళు తెరిచి చూశాడు. గన్నా పక్క మీద కూర్చుని ఉన్నది. మిగిలిన ఆడ వాళ్ళందరూ మూడు వరసలలో నిలబడి ఉన్నారు: వాళ్ళందరి పేర్లూ హసన్ ఎరుగును.

"మీ రెవరు? నేనెవరిని?" అని అతను వాళ్ళను అడిగాడు.

అందరూ ఏక కంఠంగా, "మీరు మా ప్రభువు హారూనల్ రషీద్!" అని జవాబిచ్చారు.

"మీరందరూ కలిసికట్టుగా అబద్ధం ఆడుతున్నారు! నేను అబూ అల్ హసన్‌ను కానా?" అని అతను మళ్ళీ అడిగాడు.

"పాపం శమించాలి. మీరు అబూ అల్ హసన్ కానేకాదు. మా ఏలిక, మా ప్రభువు!" అన్నారు అందరూ ఒక్కసారిగా.



అతను గన్నా కేసి తిరిగి, "ఎందుకైనా మంచిది. నా చెవి కొరుకు," అన్నాడు.

గన్నా అతని చెవి గట్టిగా కొరికింది. హసన్ పెద్దగా ఆర్తనాదం చేసి, "నేను హారూనల్ రషీద్‌నే!" అన్నాడు.

మళ్ళీ సంగీతం మొదలయింది. ఆడపిల్లలు చేతులూ చేతులూ కలుపుకుని హసన్ పడుకున్న మంచం చుట్టూ నృత్యం చెయ్యసాగారు. హసన్ ఆనందం పట్టలేక, దుప్పటి ఒకవేపూ, దిళ్ళు మరొకవేపూ గిరవాటు వేసి, వాళ్ళతో కలిసి నృత్యం చెయ్యసాగాడు.

ఖలీఫా నవ్వు ఆపుకోలేక కప్పు ఎగిరిపోయేటట్టు అట్టహాసం చేస్తూ తెర ఇవతలికి వచ్చి, "చంపేస్తున్నావురా, హసన్," అన్నాడు.

ఒక్కసారిగా నృత్యం ఆగిపోయింది. ఆడపిల్లలు బొమ్మలలాగా ఎక్కడివారక్కడ కొయ్యబారి నిలబడిపోయారు. నిశ్శబ్దం ఏర్పడింది. అందరితోబాటు హసన్ కూడా నిలిచిపోయాడు. అతను ఖలీఫాను చూస్తూనే మోసల్ వర్తకుడని తెలుసుకున్నాడు. మెరుపు మెరిసినట్టుగా అతనికి అంతా అర్థమైపోయింది.

తనను పెట్టి ఖలీఫా ఆడిన ప్రహసనం గ్రహించి కూడా హసన్, తన ఎదురుగా ఉన్నది ఖలీఫా అన్న సంగతి తెలియనట్టు నటిస్తూ, ధైర్యంగా ఆయనమీదికి వెళ్ళుతూ, "తలుపులు మూయనందుకు ఏం చేస్తానో తెలుసా, మోసల్ వర్తకుడా?" అన్నాడు.

ఖలీఫా గట్టిగా నవ్వి, హసన్‌ను కౌగలించుకుంటూ, "తమ్ముడూ, నువు పడ్డ కష్టాలకుగాను నీకు గల గొప్ప కోరిక తీర్చి, నిన్ను నా బంధువర్గంలో చేర్చుకుంటాను," అన్నాడు.

తరవాత ఆయన తన దుస్తులలో అమూల్యమైనవి ఏరి హసన్‌కు కట్టబెట్టి, "కోరుకో. నువు కోరినదల్లా ఇస్తాను," అన్నాడు.

హసన్ ఖలీఫాకు వందనంచేసి, "బతికినంత కాలమూ ఏలినవారి నీడన తలదాచుకో గలిగితే నా కదేచాలు," అన్నాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)





# ఒకరోజు రాజు

## 5

హసన్ మాటకు ఖలీఫా ఎంతో సంతోషించి, "హసన్, ఇలాటి స్వార్థరహితమైన స్నేహం నా కెంతో ఇష్టం. ఈక్షణం నుంచీ నిన్ను నా అనుచరుడుగా నియమిస్తున్నాను. నువు నేను తాగేటప్పుడు తోడుంటావు. నా సోదరుడివి. అంతే కాదు. రాజభవనంలో నీకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఉన్నది. అనుమతి లేకుండా నువు రావచ్చు పోవచ్చు. రాణీ జుబేదా మందిరం ప్రవేశించటానికి ఎవరికీ అనుమతి లేదు. కాని నీకు నేను అలాటి అనుమతి ఇస్తున్నాను. నేను జుబేదా మందిరంలో ఉండగా ఏ వేళప్పుడైనా సరే నువు యథేచ్ఛగా రావచ్చు," అన్నాడు.

ఖలీఫా హసన్‌కు రాజభవనంలోనే చక్కని బస ఏర్పాటు చేసి, అతనికి పదివేల బంగారు దీనారాలు భరణం అప్పటి కప్పుడే ఇప్పించాడు.

ఇదంతా అయిపోగానే ఖలీఫా హసన్‌ను వదిలి దీవాన్‌కు వెళ్ళిపోయాడు.

అబూ అల్ హసన్ వెంటనే తన ఇంటికి పరిగెత్తిపోయి, తన తల్లితో జరిగినదంతా చెప్పి, ఈ నాటకమంతా ఖలీఫాయే సరదాకు ఆడాడన్నాడు. తాను రోజూ వచ్చి పోతూ ఉంటానని తల్లికి మాట ఇచ్చి అతను రాజభవనానికి తిరిగి వచ్చాడు. ఈసరికి అతని విచిత్రగాథ దేశం నాలుగుమూలలా పాక్కిపోయింది.

ఖలీఫా తన యెడల చూపించే అంతులేని ఆదరంతో హసన్‌కు ఆనందమూ, ఉల్లాసమూ పెరిగాయే గాని తల తిరిగి పోలేదు, అతిశయం రాలేదు. అతను రోజూ తన హాస్యంతోనూ, ఛలోక్తులతోనూ ఖలీఫాను వినోదింపజేసేవాడు; దివాణంలో అందరినీ నవ్వించేవాడు. అతన్ని విడిచి ఉండటం



ఖలీఫాకు కష్టమైనందువల్ల అతను అస్తమానమూ ఖలీఫా భవనంలోనూ, రాణీ జుబేదా భవనంలోనూ ఉండవలిసి వచ్చింది.

ఖలీఫా వెంట హసన్ తన భవనానికి వచ్చినప్పుడల్లా అతని చూపులు తన దాసి అయిన గన్నా మీదనే ఉండటమూ, హసన్ తన కేసి చూసినప్పుడల్లా గన్నా చెక్కిళ్ళు ఎర్రబడటమూ జుబేదా గమనించింది. ఆమె ఒకనాడు ఖలీఫాతో, "గన్నా హసన్‌లు ఒకరినొకరు ప్రేమించుకుంటున్నట్టు మీరు గమనించే ఉండాలి. వాళ్ళకు పెళ్లి ఏర్పాటు చేస్తే ఎలా ఉంటుందంటారు?" అన్నది.

"నేనూ అదే అనుకున్నాను, కాని రాచ కార్యాల ఒత్తిడిలో ఆ మాటే మరిచాను. నేను అతనికి పెళ్ళాన్ని సంపాదించి పెడతానని మాట ఇచ్చానుకూడానూ. గన్నా అతనికి తగిన భార్య అవుతుందనుకుంటాను. ఏమంటారో యిప్పుడే ఇద్దరినీ అడిగి చూదాం," అన్నాడు ఖలీఫా.

రాజదంపతులు గన్నానూ, హసన్‌నూ పిలిపించి, "మీ రిద్దరూ పెళ్ళి చేసుకుంటారా?" అని అడిగారు.

గన్నా జేవురించిన ముఖంతో జుబేదా రాణి కాళ్ళమీద పడి తన సమ్మతి తెలియజేసింది.

హసన్ మటుకు, "మహాప్రభూ, తమ బానిస తమ దయాసముద్రంలో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు. కాని ఈ అందమైన, తియ్యని పేరు గల పిల్లను తన ఇంటిదాన్ని చేసుకునే ముందు రాణీగారిని ఒక ప్రశ్న అడగగోరుతున్నాడు," అన్నాడు.

"ఏమిటా ప్రశ్న?" అని జుబేదా అడిగింది.

"ఈ పిల్ల అభిరుచులు నా అభిరుచుల లాటివేనేమో కనుక్కోండి. నాకు సరదా అయినవి తాగటమూ, తినటమూ, సంగీతమూ, నృత్యమూ, కవితా మాత్రమే. ఈ పిల్ల అభిరుచులు కూడా అవే అయితే నేను ఈమెను గాఢంగా ప్రేమించగలను. అలా కాకపోతే నేను బ్రహ్మచారిగా ఉండిపోవటమే మంచిది," అన్నాడు హసన్.

జుబేదారాణి గన్నాను." అతను అన్నది విన్నావుగా? దానికి నీ సమాధానం ఏమిటి?" అని అడిగింది.

గన్నా తల ఆడించింది.

ఖలీఫా వెంటనే కాజీనీ, సాక్షులనూ పిలిపించాడు. వివాహ ఒప్పంద పత్రం రాశారు. ముప్పై రోజులపాటు రాజభవనంలో విందు వినోదాలు సాగాయి. అనంతరం నూతన దంపతులు కాపరం ప్రారంభించారు.

వాళ్ళిద్దరూ తమ కాలమంతా తినటంలోనూ, తాగటంలోనూ, వినోదాలలోనూ గడిపి, తమ దగ్గిర ఉన్న డబ్బును మంచి నీరులాగా ఖర్చు చేశారు. దగ్గిర ఉన్న డబ్బు పూర్తిగా ఖర్చు అయింది. ఖలీఫా రాజకీయ వ్యవహారాలలో మునిగి ఉండటం వల్ల హసన్‌కు నియమితమైన ఆదాయం ఏర్పాటు చేయుటం మరిచిపోయాడు. అందుచేత వాళ్ళు అంతులేని అప్పులలో మునిగి పోయారు.

ఈ కష్టం ఇలా ఉంటే, వాళ్ళకు ఖలీఫాను గాని, జుబేదాను గాని యాచించటం ఏ మాత్రమూ ఇష్టం లేకపోయింది. ఇద్దరూ చాలాసేపు తలలు వంచుకుని ఆలోచనలో పడ్డారు. చివరకు హసన్ తలఎత్తి, "మనం డబ్బు వ్యర్థం చేసుకున్నాం. ఖలీఫాను నేను అడగను. జుబేదాను నువు అడగటం



కూడా నాకు ఇష్టం లేదు. నేను మరో మార్గం ఆలోచించాను, గన్నా," అన్నాడు.

గన్నా నిట్టూర్పు విడిచి, "ఏమిటి నీ ఎత్తు? చాతనైతే నేను కూడా తోడ్పడతాను. మనం యాచించనూ లేము, మనం జీవించే పద్ధతి మార్చుకోనూ లేము," అన్నది.

"మరేమీ లేదు....మనం చచ్చిపోవాలి!" అన్నాడు హసన్.

గన్నా భయంతో కెవ్వున అరిచి, "నేను చావను. నువు చావదలిస్తే నా సహాయం లేకుండానే చచ్చిపోవలసి ఉంటుంది," అన్నది.

హసన్ ఈ మాటకు ఆగ్రహించక, "ఓసి, ఆడకూతురా! బతికి ఉండటమే జీవించ

టానికి మార్గమని నాకు బ్రహ్మచారిగా ఉన్నప్పుడే తెలుసు. నీ మందబుద్ధి చూస్తే నేను బ్రహ్మచారిగా ఉండిపోయినది మేలేనని రుజువవుతున్నది. నువు అంతగా తొందరపడి జవాబు చెప్పకుండా వివరాలు అడిగి ఉంటే, నేను చెప్పే చావును గురించి నువు ఎంతో సంతోషించేదానివి. మనం నిజంగా చచ్చేకన్న, చచ్చినట్టు నటించితే బంగారం కురుస్తుందని గ్రహించలేవూ?" అన్నాడు.

గన్నా నవ్వి, "అది ఎలా?" అన్నది.

"విను. నేను చచ్చిపోగానే నన్ను బట్టలో చుట్టి, నా కాళ్ళు మక్కాలోని కాబా కేసి ఉండేటట్టు ఈ గదిలోనే పడుకోబెట్టి, నా ముఖం మీద నా తలపాగా పెడతావు. తరవాత కెవ్వున కేకలు పెట్టి, గొల్లున ఏడిచి, బట్టలు చించుకుని, జుట్టు పీక్కుంటున్నట్టు అభినయిస్తావు. నీకు శోకదేవత రూపం పూర్తిగా అమరిన మీదట జుబేదా రాణి దగ్గిరికి పరిగెత్తిపోయి, వెక్కుతూ, మధ్య మధ్య సమయోచితంగా మూర్ఛలు పోతూ, నేను పోయానని చెప్పి, నేలకు ఒరిగిపోయి, ఒక గంటదాకా లేవవు. నీకు వాళ్ళు ఆ గంటసేపూ శైత్యోపచారాలు చేస్తూనే ఉంటారు. ఆ తరవాత మన ఇంటికి బంగారం ప్రవహిస్తూ వస్తుంది," అన్నాడు హసన్.

"అలాటి చావు సులభ సాధ్యమే. నేను నీకు సహాయపడతాను. కాని నేను ఎలా చావాలి?" అని గన్నా అడిగింది.



"అదంతా అల్లా చూస్తాడు. నువు మాత్రం నేను చెప్పినట్టు చెయ్యి. చూసుకో, నే నిప్పుడు చచ్చిపోతున్నాను," అంటూ హసన్ గది మధ్య కాళ్ళుచాచి పడుకున్నాడు.

గన్నా అతని బట్టలు విప్పి, పీనుగు బట్టలో అతన్ని చుట్టి, అతని ముఖం మీద తలపాగా పెట్టి, అతను చెప్పినట్టే అరిచి, కేకలు పెట్టి ఏడ్చి, బట్టలు చించుకుని, జుట్టు చిందరవందర చేసుకుని, బుగ్గలు చీరుకుని, ముఖమంతా పచ్చగా చేసుకుని, జుబేదా వద్దకు వెళ్ళి, నేలమీద చాపచుట్ట లాగా పడిపోయి, గుండెలు తరుగుకు పోయే టట్టు మూలగసాగింది.

గన్నా అవతారం చూస్తూనే ఆమెకు కలిగిన విపత్తు ఎలాటిదో జుబేదా గ్రహించింది. ఆమె ఆ పిల్లను తన ఒడిలోకి తీసుకుని, ఆమెకు స్పృహ తెప్పించే ప్రయత్నాలు చేసింది. గన్నా వెక్కి వెక్కి ఏడుస్తూ, మూలుగుతూ, గుండెలు బాదుకుంటూ అబూ అల్ హసన్ పేరే ఉచ్చరించసాగింది. అతి కష్టం మీద ఆమె జుబేదాకు, తన భర్త కిందటి రాత్రి అజీర్తి వ్యాధితో మరణించాడని చెప్పి, "నాకు చావు తప్ప మరేమీ మిగలలేదు." అంటూ మూర్ఛపోయింది.

అక్కడ ఉన్న స్త్రీలందరూ రోదనం చేశారు. వాళ్ళు గన్నా కోసమూ, తమకు ఎంతో వినోదం కలిగించిన హసన్ చావు తలుచుకునీ ఏడ్చారు; గన్నాను పన్నీటిలో ముంచెత్తి, ఆమెను పరామర్శించారు.





జుబేదా ఏడ్చినంతసేపు ఏడ్చి, తన సొంత ఖజానా దారును పిలిచి, "పదివేల బంగారు దీనారాలు నా ధనం నుంచి తీసి, వెంటనే గన్నా ఇంటికి చేర్చు. దీని భర్తకు ఉత్తర క్రియలు ఘనంగా జరగాలి." అని ఆజ్ఞాపించింది.

ఖజానాదారు రాణి ఆజ్ఞప్రకారం పదివేల బంగారు దీనారాల మూటను ఒక కొజా వాడి వీపుకు ఎత్తించి, అబూ అల్ హసన్ ఇంటికి పట్టించుకుపోయాడు.

తరవాత ఆమె గన్నాను కౌగలించుకుని ఓదార్చుతూ, "అల్లా నీ కష్టాన్ని తగ్గించాలి. నీ భర్త ఆయువు కూడా పోసుకుని నువు కలకాలం బతుకు," అన్నది.

గన్నా జుబేదా చేతులను తన కన్నీటితో తడిపి, ఆమె వద్ద శలవు పుచ్చుకుని, తన ఇంటికి తిరిగిపోయింది.

ఆమె తన భర్త శవంలాగా కొయ్యబారి పడుకుని ఉన్న గదిలోకి వచ్చి, ఆనందంతో నవ్వుతూ, "హాస్యగాడా, ఇక బతికిరా! ఇవాళ మనకు పస్తుతప్పింది," అన్నది.

అబూ అల్ హసన్ పీనుగు గుడ్డ తీసి పారేసి, గన్నా సహాయంతో దీనారాల సంచీని గది మధ్యకు ఈడ్చి, ఒంటి కాలి మీద గెంతుతూ నృత్యం చేశాడు.

అతను తన భార్యను అభినందించి, "అప్పుడే అంతా అయిపోలేదు, ఇప్పుడు చావటం నీ వంతు. నువు జుబేదాను మోస గించినంత తేలికగా నేను ఖలీఫాను మోస గించగలనేమో చూడాలి. మోసం చెయ్యటం ఖలీఫా ఒక్కడికే తెలిసిన విద్య కాదని తెలియజెప్పాలి," అన్నాడు.

అతను తాను చుట్టుకున్న పీనుగు బట్ట లోనే గన్నాను చుట్టి, ఆమె కాళ్ళు మక్కా కేసి ఉండేటట్టు పడుకోబెట్టి, ఏం జరిగినా సరే ప్రాణం ఉన్నట్టు బయటపడవద్దని ఆమెను హెచ్చరించాడు. తరవాత అతను ఏడుపు ముఖం పెట్టుకుని, తలపాగా సగం ఊడదీసి, కళ్ళకు ఉల్లిపాయ రుద్ది అమి తంగా నీరు కార్చుకుని, బట్టలు చించుకుని, సభ తీరి ఉన్న ఖలీఫా వద్దకు పరిగెత్తాడు.

ఎప్పుడూ ఆనందసముద్రంలో తేలుతూ ఉండే హసన్‌ను శోకమూర్తి రూపంలో చూస్తూనే ఖలీఫా అమితమైన ఆందోళన చెంది, అతనికి ఎదురు వచ్చి, దుఃఖ కారణం ఏమిటని అడిగాడు. హసన్ మరింత గట్టిగా ఏడుస్తూ, వెనక్కూ ముందుకూ తూలుతూ, "అయ్యో, గన్నా! గన్నా! నా గతి ఏంగాను?" అంటూ ముఖానికి చేతిగుడ్డ అడ్డం పెట్టుకుని ఏడవసాగాడు.

గన్నా చనిపోయిన వార్త వినవగు తుందని గ్రహించి ఖలీఫా చలించిపోయాడు. ఆయన కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి. ఆయన హసన్ భుజాల మీద చేతులు వేసి, "తమ్ముడూ, అల్లా నిన్ను కనికరించాలి. గన్నా నుంచి తీసుకున్న ఆయువు నీకిస్తాడు. ఆమె నిన్ను ఆనందంలో ముంచి ఎత్తు తుందనుకుని నీకిచ్చి చేస్తే నిన్ను దుఃఖ సముద్రంలో ముంచిందే! పాపం, గన్నా!" అంటూ వేడి కన్నీరు కార్చాడు.

ఖలీఫాతోబాటు జఫర్ మొదలైన వారు కూడా ఏడ్చారు.

తరవాత ఖలీఫా తన ఖజానాదారును పిలిచి, "ఈ హసన్ వెంట పదివేల దీనారా లిచ్చి పంపించు. ఇతను తన భార్యకు ఘనంగా ఉత్తర క్రియలు జరుపుకుంటాడు," అన్నాడు.

ఖజానాదారు ధనం సిద్ధం చేస్తూ ఉండగా హసన్ ఖలీఫా చేతిని ముద్దు పెట్టుకుని, భోరున ఏడుస్తూ శలవు తీసుకున్నాడు. అతను ఇంటికి వచ్చి, పీనుగు






లాగా పడుకుని ఉన్న గన్నాతో, "ప్రతి కన్నీటి చుక్కకూ ఒక దీనారం సంపాదించే విద్య నీకే ఉందనుకున్నావా? ఈ మూట చూడు!" అంటూ గన్నాను చుట్టిన గుడ్డ విప్పేసి, "ఇంతటితో అయిపోలేదు. ఇందుకుగాను మనం ఖలీఫా ఆగ్రహానికీ, జుబేదా ఆగ్రహానికీ గురి కాకుండా చూసుకో వలసి ఉన్నది," అన్నాడు. అందుకై తాము ఏమి చెయ్యవలసినదీ అతను గన్నాకు చెప్పాడు.

ఖలీఫా ఆ రోజు సభ త్వరగా చాలించి జుబేదా మందిరానికి వెళ్ళి, జుబేదా తన పరిచారికను పోగొట్టుకున్నందుకు పరామర్శించబోయాడు. అదే సమయంలో జుబేదా, హసన్‌ను కోల్పోయినందుకు ఖలీఫాను పరామర్శించింది.

ఖలీఫా నవ్వి, తన వెంట నున్న మస్రూర్‌తో, "రాణిగారు పొరబడుతున్నారు. నిజం చెప్పు," అన్నాడు.

మస్రూర్ జుబేదాతో, "అవును, మహారాణీ. అబూ అల్ హసన్‌కు ఏ ప్రమాదమూ లేదు. పిడిరాయిలా ఉన్నాడు. పోయినది అతని భార్య," అని చెప్పాడు. గన్నా ఉత్తర క్రియలకుగాను పదివేల దీనారాలను ఇచ్చి ఇంతకు ముందే హసన్‌ను ఖలీఫా పంపాడని విని, జుబేదా, "అబూ అల్ హసన్ ఉత్తర క్రియలకుగాను నేను ఎంత డబ్బు పంపానో నా ఖజానాధారును అడగండి," అన్నది.

పోయినది గన్నా అనీ, కాదు హసన్ అనీ భార్యా భర్తలు కొంతసేపు వాదించుకున్న మీదట ఖలీఫా మస్రూర్‌తో, "నువు హసన్ ఇంటికి వెళ్ళి ఎవరు పోయారో చూసిరా," అన్నాడు. అతను తిరిగి వచ్చే లోపుగా భార్యా భర్తలు పందాలు కూడా కాశారు.

ఎవరైనా వస్తారని కనిపెట్టి ఉండిన హసన్ మస్రూర్‌ను దూరాన చూస్తూనే, "గన్నా, ఖలీఫా పంపగా మస్రూర్ నిజం తెలుసుకోవటానికి వస్తున్నాడు. వెంటనే చచ్చిపో," అన్నాడు.

మన్సూర్ వచ్చేసరికి గన్నా గది మధ్య శవం లాగా పడుకుని ఉన్నది. ముఖానికి గుడ్డ అడ్డం పెట్టుకుని ఏడుస్తూ హసన్ ఆమె దగ్గిర కూర్చుని ఉన్నాడు. మన్సూర్ ఆ దృశ్యం చూసి, గన్నా కోసం కాసిని కన్నీళ్ళుకార్చి, శలవు పుచ్చుకుని తిరిగి వెళ్ళి, జుబేదారాణి పొరబడిందని చెప్పాడు.

ఖలీఫా సంతోషించి, "రాణీ, నువు పందెం పోగొట్టుకున్నావు," అన్నాడు.

జుబేదా మండిపడి, "ఈ మన్సూర్ అబద్ధాలమారి! గన్నా ఏడుస్తూ రావటం నా దాసీలందరూ చూశారు. నా మాట అబద్ధం చెయ్యటానికి మీ రింత కుట్ర పన్నటం ఏమీ బాగా లేదు. నేను కూడా ఇప్పుడే ఎవరినన్నా పంపి నిజం బయట పెడతాను. నా మాట నిజమైతే ఈ మన్సూర్ గాడి తల తీసెయ్యాలి," అన్నది.

ఆమె తన ముసలి దాదిని నిజం తెలుసుకు రమ్మని గన్నా ఇంటికి పంపింది.

ఎవరు ఈసారి వస్తారోనని కనిపెట్టి చూస్తున్న హసన్, ఆ దాదిని దూరాన చూసి, "గన్నా, నేను చచ్చాను," అన్నాడు.

దాది లోపలికి వచ్చేసరికి హసన్ శవం వద్ద కూర్చుని గన్నా ఏడుస్తున్నది. దాది ఆమెను తగిన విధంగా ఓదార్చి, తిరిగి వెళ్ళి, పోయినది గన్నా భర్తేనని చెప్పింది. వెంటనే జుబేదా విజయగర్వంతో, మన్సూర్ తల తీయించమని ఖలీఫాను అడిగింది.

"మన్సూర్ అబద్ధమాడితే నేను అబద్ధమాడినవాణ్ణే. నిజం తెలుసుకోవాలంటే



మనిద్దరమూ హసన్ ఇంటికి పోవాలి. బయలు దేరు," అన్నాడు ఖలీఫా.

జుబేదా ఖలీఫాల వెంట ఒక పటాలం బయలుదేరింది.

ఇలా జరగవచ్చునని ముందే ఊహించిన హసన్ గన్నాతో, "ఇద్దరమూ చచ్చి పోదాం," అన్నాడు.

ఖలీఫా మొదలైన వాళ్ళు లోపలికి వచ్చే సరికి రెండు శవాలు కనిపించాయి. వచ్చిన వాళ్ళు వాటిని చూసి కొయ్యబారి పోయారు.

"కాని ఎవరు ముందు పోయినదీ తెలియటం ఎలా?" అన్నది జుబేదా.

"ఆ సంగతి చెప్పినవాళ్ళకు పదివేల దీనారాలిస్తాను," అన్నాడు ఖలీఫా.

"నా కివ్వండి. ముందు నేనే పోయాను," అన్నాడు హసన్ గుడ్డ చుట్టలో నుంచి.

శవం నుంచి మాటలు రావటం విని జుబేదా హడలిపోయింది. కాని నిజం పసిగట్టిన ఖలీఫా గది మధ్య చతికిలబడి వెర్రిగా నవ్వుతూ, "లేదురా, హసన్! నవ్వలేక చస్తున్నది నేను!" అన్నాడు.

ఖలీఫా నవ్వు సంబాళించుకునేసరికి హసన్, గన్నా లేచి కూర్చున్నారు. హసన్ ఖలీఫా కాళ్ళ మీద పడ్డాడు. గన్నా జుబేదా కాళ్ళ మీద పడింది. ఇద్దరూ క్షమాపణలు వేడుకున్నారు.

హసన్ ఖలీఫాతో, "ప్రభూ, బ్రహ్మచారిగా ఉండగా నాకు డబ్బు మీద నిర్లక్ష్యం ఉండేది. కాని ఈ గన్నా ఎంత బంగారమైనా సంచులతో సహా తినెయ్యగలదు. అవకాశం ఉంటే ఏలినవారి ఖజానానూ, ఖజానాదారునూ కూడా తినేస్తుంది," అన్నాడు.

ఖలీఫా జుబేదాలు వారిని క్షమించి వాళ్ళకు చెరొక పదివేల దీనారాలూ అదనంగా ఇచ్చారు.

హసన్‌కు గల అవసరాన్ని ఖలీఫా గుర్తించి, అతనికి జఫర్‌తో సమంగా జీతం ఏర్పాటు చేశాడు. అటుతరవాత హసన్ గన్నాలు ఏ లోటూ లేకుండా, సుఖంగానూ, సంతోషంగానూ జీవించారు.

— (అయిపోయింది)

